# "పరుశరామ శాస్త్రి" గారి కూతురు



చిట్టి పొట్టి నవల  బై  వారణాసి శ్రీ రామ కృష్ణ --అమరవాతి

## "పరుశరామ శాస్త్రి" గారి కూతురు

శ్రీనివాస మూర్తి యువ వయస్కుడు . ఇతను సరస్వతీ మహాలు అనే లైబ్రరీ కి మేనేజర్ . లైబ్రరీ చూసే మనిషిని లైబ్రేరియన్ అంటారు . కానీ సరస్వతీ మహల్ ని స్థాపించిన " రాజా వెంకట రాయల వారు - ఇతనికి మేనేజర్ అన్న పేరుతో వుద్యోగం ఇచ్చాడు . ఈ మేనేజర్ గారు ఏ పనినైనా చేసేందుకు సిద్ధ పడుతూ వుండే ధైర్యం కల మనిషి . అందరు లైబ్రేరియన్స్ లా ఎబ్బెబ్బే -- బెబ్బె కాదు .

<> రాజావారు విచిత్ర పుస్తక ప్రియుడు . విచిత్రము అపురూపమైన గ్రంధాలను సేకరించి తన సరస్వతీ మహల్ నింపి ఆ పుస్తకాలను భావి తరాలకు ఇవ్వాలన్నది అయన ధ్యేయం .రాజావారు కోటీశ్వరుడు .ఇంగిలీషు ప్రభుత్వము వారికి ప్రియుడు .

రాజావారికి కి " మబ్బుల్లో తొమ్మిది తలుపులు " " అనే పేరుగల విచిత్రమైన పుస్తకము వున్నదని - దానిలోని మంత్రాలతో మనము శని గ్రహాన్ని స్వాధీనము చేసుకొని దాన్ని మన ఇష్టం వచ్చినట్లు ఆడించటం ఎల్లా ? అన్న విషయం మీద - రామబాణం లాంటి aneka మంత్రాలు - చేయవలిసిన పూజా పునస్కారాలు - యజ్ఞ్యా, యాగాలు వంటి వివరాలు వున్నాయి అని తెలుస్తుంది .

.

ఈ పుస్తకాన్ని రాసిన పరుశురామ దీక్షితులు అప్పటికే చనిపోయి వున్నాడు . డబ్బులేక నో లేదా పుస్తకాన్ని రహస్యం గా ఉంచాలి అన్న ఉద్దేశ్యంతోనే ఏమో కానీ - దీక్షితులు గారు ఆ పుస్తకానికి, తన శిష్యుల చేత రెండు నకళ్లు రాయించాడు .నకలు అనగా అద్దంలో ప్రతిబింబంలాగా అసలు పుస్తకములో వున్నది వున్నట్లుగా తిరిగి రాయటం .

మొత్తంగా చూస్తే రాజా వారి కి తెలిసినది ఏమిటంటే - "మబ్బుల్లో తొమ్మిది తలుపులు" అన్న పెరు న‹ మొత్తము మూడు పుస్తకాలు ఉన్నాయని - కానీ అందులో ఒక్కటే "దీక్షితులు గారి చేతిమీదగా రాయబడినది అని - దీక్షితులు గారు పుస్తకం రాస్తూ వున్నప్పుడు శని దేవుడే ఆయనకుప్రత్యక్షం అయి - అయన చేయి పట్టుకొని మరీ పుస్తకాన్ని రాయించాడు అని - నిజమైన పవర్ అంతా ఈ పుస్తకంలోని వున్నదని - మిగతా రెండూ పవర్ లేనివి అని - తెలుసుకుంటాడు

అసలైన పవర్ వున్నా పుస్తకం కోసం వెతికి - దాన్ని తనకు తెచ్చి ఇస్తే - నీకు అపారమైన ధన ము ఇస్తాను -- అని రాజా వారు తన లైబ్రరీ మేనేజర్కి ఆర్డర్ వేస్తాడు . అప్పుడు శ్రీనివాస మూర్తి -- తంజావూరు వెళ్లి - అక్కడ పురాతన పుస్తకాల లైబ్రరీ కి బుక్ బైండర్ అయినా పొన్నప్పన్ ని కలుస్తాడు - ఈ పొన్నప్ప పేరుకే బుక్ బైండర్ కానీ -- అతను పెరియ పాండ్యన్ అనే జమీందారు కి నమ్మిన బంటు . పెరియ పాండ్యన్ కూడా విచిత్రమైన పుస్తకాలు సేకరించే అలవాటున్న జమీందారు .

పెరియ పాండ్యన్ -- ఈపాటికే ఈ పుస్తకానికి చెందిన మూడు కాపీలు కూడా సేకరించి వున్నాడు .ఇతని అభిప్రాయం ప్రకారం కూడా శని దేవుడే , రచయిత దెగ్గర కూచుని మరీ ఆ పుస్తకాన్ని రాయించాడు . అనుమానా స్పదముగా వున్న రచయిత మరణం తరువాత నే పెరియ పాండ్యన్ ఆ మూడు పుస్తకాలను సేకరించాడు - కానీ ఆ మూడు పుస్తకాలలో ఎదో ఒక్క పుస్తకమే పవర్ వున్నదని - మిగతా రెండూ ఆ పుస్తకానికి నకళ్లు కాబట్టి అవి డమ్మీ లని పెరియ పాండ్యన్ కూడా అనుకుంటూ ఉంటాడు . ఐతే పరుశురామ దీక్షితులు రాసిన

- అసలు పుస్తకం లోని ప్రతి  విషయాన్నీ - కాపీ కొట్టి   తమ సొంత మాటల తో రాసిన గ్రంధాలు కూడా కొన్ని వున్నాయి అని పెరియ పాండ్యన్ ఇప్పటికే ఒక అభి ప్రయానికి వచ్చి వున్నాడు .    . అందువల్ల శ్రీనివాస మూర్తి -  పుస్తకం కోసమని తన దెగ్గరికి వచ్చిన పుడు  పెరియ పాండ్యన్.   ఆ  మూడు పుస్తకాలలో అసలుది ఎదో ?  కనిపెట్టే పని శ్రీనివాస మూర్తి అప్పచెపుతాడు  దీనికి అవసరమైన  ధనము సమ కూర్చుతాడు కూడానూ .

అప్పుడు మన శ్రీనివాస మూర్తి --  మూడు పుస్తకాలలో  ఏది అసలైనది ??  అని పరిశోధన చేస్తూ -- కన్యాకుమారి చేరుకుంటాడు . తాను పరిశోధన పనిమీదా బయటకు వచ్చినప్పుడల్లా --  ఎవరో ఓ స్త్రీ తనను నీడలా అనుసరిస్తూ వున్నదని  శ్రీనివాస మూర్తికి  తెలుస్తుంది . అతడు  ఆమెకు "చెలికత్తె" అన్న పేరుపెట్టుకుంటాడు .

శ్రీనివాస మూర్తి తన పరిశోధనలో  భాగంగా -- మాళవికా అమ్మన్ , అనే స్త్రీని కలుస్తాడు . ఈమె ఎవరంటే - పెరియ పాండ్యానికి  - ఆ మూడు డు పుస్తకాలు అమ్మిన  అతనికి భార్య .  ఈమె భర్త తన పుస్త కాలను పెరియ పాండ్యానికి అమ్మిన మరునాడు ఏ విచిత్రమైన రీతిలో తనను తాను చంపుకుంటాడు . అందువల్ల ఈ విధవరాలు - తన భర్త అమ్మివేసిన ఆ పుస్తకాలను వెనక్కు తెచ్చుకొన్నచో తన భర్త ఆత్మ సంతోషిస్తుంది నే నమ్మకంతో ఉంటుంది  -  ఆ పుస్తకాలని   ఉచితంగా వెనక్కి తీసుకోవాలనే తలంపులతో - మాళవిక  శ్రీనివాసమూర్తిని ,  అనేక కోరికలకు గురి చేస్తుంది .శృంగారాన్ని కూడా సూచిస్తుంది .  అయితే శ్రీనివాస మూర్తి తన  ప్రేమ మోజులో పడి ఆ పుస్తకాలు తనకు ఇచ్చేది లేదని స్పష్టంగా గ్రహించినాక   మాళవిక  శ్రీనివాసమూర్తి  - నెత్తి పై

కత్తి తో కొట్టి గాయ పరుస్తుంది . అప్పుడు మూర్తి స్పృహ కోల్పోతాడు .

చచ్చాడు - చచ్చు వెధవ అనుకుంటూ మాళవిక అతన్ని బయటికి పారవేయిస్తుంది . స్పృహ తెచ్చుకున్న మరునాడు , శ్రీనివాస మూర్తి " ఇన్ని తిప్పలు నాకెందుకు అన్న భావనతో - తన వద్ద నున్న మూడు పుస్తకాలనుతీసుకొని బుక్ బైండర్ అయినా పొన్నప్పన్ ని కలుస్తాడు- అతని ద్వారా పెరియ పాండ్యన్ కి పుస్తకాలు వాపసు ఇచ్చి వేదాము అని . మూర్తి వెళ్లేసరికి బుక్ బైండర్ అయినా పొన్నప్పన్ షాప్ యొక్క పై కప్పునుండీ మెడకు వురి తాడుతో కిందకు వేలాడుతూ ఉంటాడు . అప్పుడు శ్రీనివాస మూర్తి " ఇది చూడటానికి ఈ పుస్తకంలో పుస్తకాలలో చిత్రించ బడిన ఒక చిత్రానికి కార్బన్ కాపీలా వున్నది" అని అనుకంటాడు . అప్పుడు శ్రీనివాసమూర్తి తన పరిశోధన విరమించుకునే ఉద్దేశ్యం వదిలివేసి - తదుపరి పరిశోధన కోసం - కుంభకోణం వెళ్లుతాడు -- ఆ మూడు పుస్తకాలని పట్టుకొని .

కుంభకోణం వచ్చి శరవణన్ అనే వారిని కలుస్తాడు . వీరు ఎవరంటే - పుస్తకాలు మాళవిక భర్త వద్ద వున్నరోజుల్లో - అతను వాటిని పాండ్యన్ కి అమ్మటానికి వీలుగా - పుస్తకంలోనుండి రాలి పోతున్న పేజీలను తిరిగి పుస్తకంలో కి ఇమిడ్చి అంటించి ఇచ్చిన వారు. వీళ్ళు ఆసక్తి కొద్దీ శ్రీనివాస మూర్తి దగ్గిర వున్నా పుస్తకాన్ని పరిశీలించి " నీ పుస్తకం లోవున్నా మొత్తము తొమ్మిది చిత్తరువులు వున్నవి . అందులో ఆరింటికింద మాత్రమే "విక్రమ్ "అని సంతకం చేసివున్నది మిగతా మూడు చిత్తరువులలో "శంకర్ ." అంటే {చందమామ శంకర్ } అని సంతకం చేసి వుంది ఇది గమనింప తగిన విషయమని శరవణన్ చెపుతాడు .

ఈ ఆలోచనతో -- శ్రీనివాసమూర్తి తన పరిశోధన కోసమై కటకం చేరుతాడు . అక్కడ హరిదేవ్ పాండా అనే వాడిని

కలుస్తాడు .ఎందుకంటే ఇతని దేగ్గెర కూడా " మబ్బుల్లో తొమ్మిది తలుపులు " పుస్తకం ఒకటి వున్నది . ఈ పుస్తకం పరిశీలించి చూసినాక - శ్రీనివాసమూర్తి కి ఒక విషయము తెలుస్తుంది . మొదట తాను చూసిన - శంకర్ అన్న సంతకం తో వున్న మూడు చిత్తరువులు కాక వేరే మరి మూడు చిత్తరువు లు ఇక్కడ ఇంకా అదనంగా వున్నాయి . ఈ మూడు చిత్తర్వులపై కూడా -- శంకర్ అన్న సంతకం వున్నది ."ఇప్పుడు చూస్తే శంకర్ అని సంతకం చేసి వున్న వి - మొత్తంగా ఆరు చిత్తరువులు లెక్క తేలినవి -- కాబట్టి శంకర్ అని అని సంతకం చేసివున్న చిత్తరువులు మొత్తంగా తొమ్మిది వుండే అవకాశము వున్నదని - మొత్తం తొమ్మిది చిత్తరువులూ "శంకర్ " అన్న సంతకంతో వున్న పుస్తకమే అసలు సిసలు పవర్ వున్న పుస్తకంగా తయారు అవుతుంది కాబోసు అని శ్రీనివాస మూర్తి ఆలోచిస్తాడు .

శ్రీనివాస మూర్తి ఈ విషయాన్నీ పాండ్యన్ కి తెలిపి - పరిశోధన సాగించుతాను - డబ్బు పంపండి అని టెలిగ్రామ్ ఇస్తాడు . - నీవు నీ పని కొనసాగించు - డబ్బు భాద్యత నాది " అని పాండ్యన్ జవాబు ఇస్తాడు . ఈ తరువాత , మూర్తి , హరిదేవ్ పాండా కి వీడ్కోలు చెప్పుదామని అతని ఇంటికి వెళతాడు . కానీ ఆ సరికే , హరిదేవ్ పాండా తన ఇంటిలో వున్నా బావిలో శేవమై తేలి కనిపిస్తాడు . అప్పుడు మూర్తి - హరిదేవ్ పాండా దెగ్గర వున్నా పుస్తకం కోసం వెతుకుతాడు . ఆ పుస్తకం సగం తగల పడిన స్థితిలో, శంకరు - అనే చిత్రకారుడు సంతకము చేసిన చిత్రాలు మూడూ కూడా తొలగించా బడి దొరుకు తుంది . చిత్తరువులూ కూడా పుస్తకం నుండి తొలగించా బడి న తరువాతనే పుస్తకం తగల పెట్ట బడిందని మూర్తి తెలుసుకుంటాడు . ఇంతకీ ఇతనికి పుస్తకం ఎక్కడవుందో అనేది చూపించటంలో సహాయ పడినది ఎవరు ? అంటే అది ఇతడు కన్యాకుమారిలో ఉండగా అదృశ్యంగా అతని వెన్నంటి తిరిగిన " చెలికత్తె "

అనిమూర్తతో పిలవబడ్డ పిల్లయే .ఈ పిల్ల ఏ ఇతనికి తిరిగి కనపడి - పాండా కి చెందిన పుస్తకం దెగ్గరికి దారి చూపింది .

మూర్తి ఇప్పటికి పుస్తకానికి ఉన్న రెండు నకళ్లను పరిశీలించి వాటిని దక్కించుకున్నాడు .ఇక మూడవ పుస్తకం కోసం అని జాడలు తీసుకుంటూ , వెళ్లి - మూడవ పుస్తకానికి యజమానురాలైన ప్రమీలా బారో అనే స్త్రీని కలుస్తాడు .ఈమె ఒక పండితుని కుమార్తె . ప్రమీల మూర్తిని చూస్తూనే చూసి చికాకు పొంది - అటుపిమ్మట అతడు పెరియ పాండ్యన్ ,అనే జమీందారు తరఫున వచ్చాడు అని తెలుసుకొని - అతన్ని గెంటి వేయిస్తుంది . వీధిలోకి గెంటపడిన మూర్తి ,పరధ్యానంగా వీధిలో నడుస్తూ ఉండగా అతని మీద ప్రాణాంతక మైన దాడి జరుగుతుంది. కానీ ఇతనికి ఏ ప్రాణాపాయం కలుగకుండగా " "చెలికత్తె " అనే యువతీ అక్కడ ప్రత్యక్షం అయి తన దెగ్గర ఉన్న మంత్రం శక్తులను వుపయోగించి మూర్తిని ప్రాణాపాయం నుండి రక్షించుతుంది .

ఈ తరువాత మూర్తి ఇతడు తన పుస్తకాలను తన బస వున్న గదిలోనే భద్ర పరిచి - తిరిగి వెళ్లి ప్రమీలా బారో. ని మరో మారు కలుస్తాడు . బుక్కులోని చిత్తరువులలో ని సంతకాల తేడాని దానిమీద తనకు గ ల ఊహలను ఆమెకు వివరించి - ఆమె పుస్తకంలో కూడా మరో మూడు చిత్తరువులు మీద "శంకర్ ." అని సంతకం చేసి వున్నవైతే - మొత్తము తొమ్మిది "శంకర్ " అని సంతకం చేసివున్న చిత్తరువులు బయట పడతాయని - ఆ తొమ్మిది చిత్తరువులు ఏ పుస్తకంలో కలిపి చదివితే ఆ పుస్తకం - పరుశురామ దీక్షితులు నిజంగా రాసిన పుస్తకం అవుతుంది అని - రాతల్లో ఏమీ తేడాలేదని - వున్న తేడా అంతా చిత్తరువులలోనే వున్నదని - ఇవి చూస్తూ

పుస్తకపు అర్థము గ్రహించితే - శని గ్రహాన్ని కంట్రోల్ చేసే మంత్ర విద్య - మనకు సొంతము అవుతుందని చెపుతాడు . అప్పుడు ప్రమీలా బారో , తన వద్ద ఉన్న పుస్తకం కాపీని మూర్తికి చూపుతుంది .తన సత్రపు గదిలో తాను దాచిన పుస్తకాలు తెచ్చి ప్రమీలా బారో కి చూపి ఆమె అభిప్రాయము తెలుసుకుందాము అనే ఆలోచనతో ఆమె ఇంటిలోనుండి బయటికి రాగా -- మూర్తి మీద మరో సారి ప్రాణాంతక దాడి జరుగుతుంది . అతడు ఆ దాడిని తట్టుకొని వెనక్కి వచ్చే సరికి - . ప్రమీలా బారో తన ఇంటిలోని పైకప్పు మీదనుండి కిందవున్న కట్టెల పొయ్యి మీదకు వ్రేలాడ తీయపడి --ఆ కట్టెల మంటలు తన చితిమంటలుగా - ప్రాణాలతో నే కాల్చబడి చని పోయి ఉంటుంది .

ఇక చేసేందుకూ ఏమీ లేక మూర్తి తిరిగి తన సత్రం గదికి వెళ్లే సరికి - అక్క డా అతను భద్రంగా దాచుకున్నరొండు కాపీలు పుస్తకపు కూడా కనపడ కుండా పోతాయి .వీటిని ఎవరు దొంగిలించారు అన్న ప్రశ్న రాగా -- " వాయస నేత్ర ప్రియ " అనే ఆవిడే వీటిని దొంగిలించి ఉంటుంది అని మూర్తి యొక్క చెలికత్తె నమ్మకంగా చెపుతుంది . మూర్తి నమ్ముతాడు .

ఈ " " వాయస నేత్ర ప్రియ "అనే ఆవిడా ఎవరంటే - శని దేవుని కొలిచే ఖుద్ర భక్తురాలు - శనిని ఆవాహన చేసుకొని అతడిని తన బానిసను చేసుకోవాలని - అతడి గ్రహాన్ని తన ఆవాసం చేసుకొని - నిత్యా యవ్వనంతో చావు అనేది లేని మనిషిగా బ్రతకాలి అని కోరుకొనే ఆవిడ . కాకుల యొక్క కనుగుడ్లు పెరికి వాటితో గుగ్గిళ్ళు చేసుకొని తినటం ఈమె కు ఇష్టము కాబట్టి ఈమెకు " వాయస నేత్ర ప్రియ" అని పేరు - ఈమెకు వేలాదిగా శిష్య గుణముఉంది .

ఇప్పటివరకూ జరిగినది మనము అవలోకించుకుంటే -- " వాయస నేత్ర ప్రియ" వద్ద మొత్తం తొమ్మిది చిత్రములు -

అవీ ' శంకర్ " చే సంతకము చేయబడినవి - మరియు పుస్తకము వున్నది . ఇప్పుడు " వాయస నేత్ర ప్రియ" తాను రహస్యంగా నిర్మించుకున్న తన ఆశ్రమానికి చేరి యజ్ఞవాటికను నిర్మించి శని దేముని ఆవాహనకు కూచుంటుంది . చెలికత్తె యొక్క శక్తుల ఆధారంగా మన శ్రీనివాస మూర్తి ఈ రహస్య ఆశ్రమంలోకి ప్రవేశించుతాడు . మూర్తి యొక్క చెలికత్తె - తన శక్తులను వాడి శని దేముని ఆవాహన యజ్ఞాన్ని భంగపరిచి - " వాయస నేత్ర ప్రియ"ను సంహరించుతుంది .ఇతని పుస్తకాలు ఇతనికి వెనక్కి ఇచ్చేస్తుంది .

తన చెలికత్తె ,యొక్క వీర పనితనం చూసిన మూర్తి - ఆమెను తప్పించుకొని పుస్తకాలతో సహా వెళ్లి ఒక కారు లో కూచుని - పెరియ పాండ్యన్ వద్దకు ప్రయాణం కట్టు తాడు . అనుకోకండా మూర్తి కారును ఒకరు గుద్ది యాక్సిడెంట్ చేస్తారు . మూర్తి స్పృహలోకి వచ్చి చూసుకునే సరికి అతని వద్ద వున్న పుస్తకాలు - మొత్తము తొమ్మిది చిత్తరువులతో సహా మాయం అయిపోతాయి. మూర్తి యొక్క చెలికత్తె తిరిగి మూర్తికి ప్రత్యక్షమై - ఆ పుస్తకాలను - పెరియ పాండ్యన్ నే పట్టుకు పోయాడని - కారు యాక్సిడెంట్ కూడా అతనే చేయించాడని చెపుతుంది . ఆపై ఈ చెలికత్తె ఏ మూర్తిని పెరియ పాండ్యా యొక్క భవంతిలోకి తీసుకు పోతుంది .

ఇప్పుడు పెరియ పాండ్యా తన దెగ్గర వున్న పుస్తకాలలో వున్న మంత్రాలు చదివి - ఆకాశంలో కనపడుతున్న మార్పులను తన వద్ద వున్న చిత్తరువులతో పోలుస్తూ - శని దేవుడు - శని గ్రాహం నుండి భూ గ్రాహం వచ్చే దారులు సరిగ్గా తెరుచుకుంటున్నావా? లేవా అని పరిశీలిస్తూ ఒక హెూమము జరుపుతూ ఉంటాడు . పాండ్యన్ , మూర్తిని చూసి జంకూ గొంకూ లేకుండా అతడిని ఆహ్వానించి - తాను శని గ్రహాన్ని స్వాధీనం చేసుకో బోతున్న తతంగాన్ని కన్నులారా

వీక్షించి ఆనందించమని అడుగుతాడు . నిజంగానే ఆకాశములో మార్పులు సంభవించి శని గ్రాహం నుండి భూ గ్రహానికి దారి చూపుతూ ఒక్కొక్క తలుపు తెరుచుకుంటూ ఉంటుంది .

కానీ తొమ్మిదో తలపు తెరుచుకొనే సరికి- ఏదీ కూడా సవ్యంగా జరగటం లేదని మూర్తికి అనుమానం వస్తుంది - మూర్తి చూస్తూ ఉండగానే పెరియాపాండ్యన్- తన హోమపు జ్వాలల మధ్య తానే చిక్కి మరణించుతాడు . పాండ్యన్ భాదతో విలపించుచూ తన చేతులో పట్టుకుని వున్నా ఆ తొమ్మిది చిత్తరువులు హోమగుండంలోనుండి బయటకు మూర్తి వైపుకు విసురుతాడు . ఇంతా జరిగిన మీదట చెలికత్తె అనే పిల్ల మూర్తి పక్కన నిలబడుతూ - భుజం భుజం రాస్తుంది . ఆమె తనతో ప్రేమలో వున్నదని మూర్తి గ్రహించుతాడు . ఇద్దరూ ప్రేమకబుళ్లు చెప్పుకుని - ముద్దులాడుకుంటారు . వీరు ఇట్లా ప్రేమలో విహరిస్తూ ఉండగా ఆకాశమంతా ప్రశాంతరంగా మారి - ఉన్నట్లు ఉండి ఒక ఉల్కా జారిపడి పెరియ పాండ్యన్ భవనాన్ని గుద్దుతుంది . దానితో ఆ భవంతినిప్పు ముద్దలా మారిపోతుంది . ఆ నిప్పుల ముద్దను చూపుతూ " దాని వెలుగులో మనకు పెళ్లి జరగాలి - అదే నేను కోరుకునేది " అని చెపుతుంది

వీరి సంసారం పువ్వుల పడవలా సాగుతూ ఉంటుంది . మరి మూర్తిలోని పరిశోధకుడు ఊరుకుంటాడా ? పుస్తకంలో చెప్పినట్లు శనిదేవుడు ఎందుకు లొంగి రాలేదు? అని అనేక సార్లు అడుగుతాడు . అయితే చెపుతాను రాండి -- అంటూ ఒకరోజు న మూర్తి భార్య అతనిని పరుశురామ దీక్షితులు ఇంటికి తీసుకో వెడుతుంది . ఆ క్షణంలో పరుశురామ దీక్షితులు భార్య - తన భర్త యొక్క వర్ధంతిని జరుపుకునే ఉద్దేశ్యంతో ఇంట్లో బూజులు దులిపి ఆ చెత్త చెదారాన్ని

వాకిటిలో పారబోస్తుంది . ఆ చెత్తలో ఒక చిత్తరువును మూర్తి భార్య బయటికి తీసి మూర్తికి చూపుతుంది . దాన్ని గురించి ఇట్లా చెపుతుంది. అందులో గంగను శిరస్సుపైకి ఆహ్వానము చేస్తున్న శివుని బొమ్మ ఉంటుంది . ఈ శని దేవుడు భూమి మీదకు దూకుటకు " శివుని సమ్మతి " తప్పని సరి అని ఈ చిత్రము చెపుతున్నది . తన పుస్తకం చదివి ఎవరైనా సరే శని గ్రహాన్ని ఆవాహన చేసి లోక కంటకులుగా తయారు కావచ్చునని పరుశురామ శాస్త్రి భయపడి - తనచేత పుస్తకము రాయించిన శని దేవముడినే తన సందేహము అడిగినాడు .

అందుకుశని దేవుడు నవ్వి " నన్ను ఆహ్వానించు వారి పట్ల "శివ శక్తులు" ప్రసన్నముగా లేనిచో నేను భూమీ మీద ప్రవేశించుట కల్లా . గంగ వచ్చుటకు శివుడు మరియు అతని శక్తీ యొక్క అంగీకారము ఎంత అవసరమో - నా రాకకు వారి అంగీకారము కూడా అంతే అవశ్యము . నా రాకడకు వారు ఇరువురూ అంగీకరింప వలయును - అప్పుడే నేను భూమి పైకి వత్తును " అని చెప్పెను . ఇది విన్నాక పరుశరామ శాస్త్రి ఈ తొమ్మిది తలుపులు విజయవంతముగా తెరుచుటకు ఈ చిత్తరువే తాళము వంటిది అని భావించి దానిని పుస్తకములోనుండి వేరుచేసి దాచెను . ఇది ఉన్నట్లు అతనికి - ఆ నీలఖంటునికి తప్ప వేరొకరికి తెలియదు . ముందుగాశివ పార్వతులను ధ్యానించి వారి అనుమతి కొరక పోవుటవల్లనే -- అలా కొరవలే అని తెలియక పోవుటవల్లే -- పెరియ పాండ్యన్ -- తొమ్మిదో తలపు తెరుచు సమయమున శని దేముని ఆగ్రహానికి గురయి మరణించాడు- పుస్తకములో నిజాము లేక కాదు " అని మూర్తి భార్య - ఆ పిల్ల పేరు శాంభవి తన భర్తకు వివరణ చేసెను

. .ఈ వివరణ చెప్పి - ఆచిత్తరువును చేత పట్టుకొని ఆమె ఆకాశములోనికి వెళ్లి పోయినది .

ఇటు తరువాత ఎవరివద్దనైనా ఈ పుస్తకము ప్లస్ తొమ్మిది చిత్తరువులు ఉండి మొదలుగా  శివ శక్తుల పూజ చేయవలెనని తెలుసుకొన్న పిమ్మటకూడా ఏమీ చేయలేరు . ఎందుకనగా శివుడు ప్రసన్నము అయినపుడు ఆకాశములో ఏమి కానవచ్చునో ఆ చిత్రము ఆధారంగానే పోల్చుకొన వలయును . ఆ తరువాతనే శని దేముని ఆహ్వానము చేయవలెను . అందువల్లనే ఆ చిత్తరువుని  చేత పుచ్చుకొని నేడు శాంభవి పైకి ఎగిరినది .

ఇంతకూ ఈ శాంభవి ఎవరయ్యా అందురా ? ఆమె "పరుశరామ శాస్త్రి" గారి కూతురు బాల్యములోనే మూర్తిని శాస్త్రీయముగా ఆడి నది - వివాహము అయినా కొద్దీ కాలమునకు భర్త మొగము ఎరుగకనే మరణించిన కన్య . ఆమె భర్త పట్ల తనకు గల ప్రేమ మరియు మురిపెము తీర్చుకొనుటకు -మరియూ  శివుని ఫటము పైలోకమునకు చేర్చి - లోకంలోని  ఎవరివల్లానూ కూడా శని దేవుడు భూమి పైకి రాకుండా చూడవలెనన్న తండ్రి కోర్కెను ఫలింపచేయుటకు - స్వర్గము విడిచి భూమికి వచ్చి - మూర్తిని వలచినది - తన కోర్కెలు నెరవేర్చుకున్నది

ఈ తత్ కధకు మూలము ఒక ఫ్రెంచి రచన అని ఒప్పుకుంటాను.. కానీ ముగింపు  మాత్రము నా సొంతము . అది ఒరిజినల్ ననవలలోది కాదు - శివుని ఫోటో ప్రస్తాపన వచ్చిన దెగ్గరనుండీ రాసినది అంతానూ న్నా సొంతము - మా ఇలవేల్పు శాంభవి దేవి  ఈ ముగింపు పలికించింది అని సవినయంగా చెపుతున్నాను - ఇట్లు వారణాసి శ్రీ రామ కృష్ణ --అమరవాతి